కాయక్లేశ రూపములగుటచేతనున్ను, జ్ఞానము పుండ్రియ క్రియ పూర్వకముగా చేయవలసిన దగుటచేతనున్ను భక్తిమరణాంగసాధ్య మయినదగుటచేతనున్ను వాటిని చేయశక్యము కాదని ముముక్షువు దుఃఖప ని ఊహించినను ఈశ్వరునికి అత్యంత పరతంత్రమైన ఆత్మస్వరూపమునకు ఈ స్వతంత్రోపాయములు విరుద్ధములని యును ఆలోచించి, వీటిచేత ముక్తి కలుగదనియును ఇటుపయి నిశ్చింపవలసినదే అనియును దుఃఖించుచున్న ఈ అర్జునుని శోకనివృత్తి కొరకు, సులభముగా చేయతగినట్టియును, స్వరూపానురూపమైనట్టియును ఇంతకు తప్పవేరే సాధనము లేదనతగినట్టి చరమ సాధనమును చెప్పుటచేతను ఈ శ్లోకము చరమశ్లోకమనబడును.

చరమార్థ ప్రతిపాదకమగుటచే తనే చరమశ్లోకమనబడును గాని గ్రంథముయొక్క అంతమందు ఈ శ్లోకము చెప్పబడినందువల్ల కాదు, దీని వెనక కూడా కొన్ని శ్లోకములున్నవి.

౧. ఈ శ్లోకముయొక్క పూర్వార్ధము చేతను ఉపాయస్వీకారము చేయు చేతనునియొక్క కృత్యము చెప్పబడుచున్నది. ఉత్తరార్ధము చేతను ఉపాయభూతుడైన ఈశ్వరునియొక్క కృత్యము చెప్పబడుచున్నది.

౩. చేతనుడిప్పుడు చేయవలసిన కృత్యము సిద్ధోపాయపరిగ్రహము అనగా తనరక్షణమునకు ఈశ్వరుడే సాధనమని నమ్మియుండుట.

౪. మామేకం శరణం వ్రజ అను వాక్యముచేతను సిద్ధోపాయ స్వీకారమాత్రమును చెప్పక సర్వధర్మాన్ పరిత్యజ్య అను వాక్యము చేతను సర్వధర్మపరిత్యాగమును కూడా చెప్పుటకు హేతువు ఏమనగా-

సిద్ధోపాయమునకు సాధనాంతర పరిత్యాగమను అంగము కానప్పుడు స్వరూపసిద్ధి లేకపోవుటవలన సాంగముగా చెప్పుచున్నది.

ప్రత్యాఖ్యపాహి వాచామేవ్, స్నాత్వావిధివద్ద్రుమేత్, స్థిత్వాపినగ్నం ధ్యానవేదతాయాత్, ధ్యాత్వామేవం ఇతిన్యసం, ఇ

మనము సాధనములు కానివాటియందు సాధనబుద్ధిచేసితిమే అను జ్ఞానముతోకూడా విడచి పెట్టుట-

౧౮- పరియను ఉపసర్గార్థము చెప్పబడును-

పరియను ఉపసర్గముచేతను, బ్రహ్మహత్యయు, సురాపానము, స్వర్ణస్తేయము, గుర్వంగనాగమనము, మొదలయిన మహాపాతకములను అజ్ఞానముచేతచేసి తరువాతలజ్జపడి పశ్చాత్తాపమును పొంది విడచుకొనునప్పుడు యెన్నడును వాటిలో బుద్ధిపూర్వకముగాగాని అబుద్ధిపూర్వకముగాగాని ప్రవర్తింపకుండా రుచివాసనలతో కూడా వదులుకొన్నట్లు పాతకశబ్దముచేత చెప్పబడుచున్న ఉపాయాంతరములను పునరన్వయములేకుండా రుచివాసనలతో కూడా విడవవలయును అను అర్థము చెప్పబడుచున్నది-

౧౯- త్యక్త్వా అను ల్యప్ప్రత్యయార్థము చెప్పబడును-

త్యక్త్వా అనుల్యప్ప్రత్యయముచేతను స్నాత్వాభుంజీత అను విధియందు స్నానముచేసియే భుజింపవలెను అను నియమమును చెప్పినట్లు ఈ సిద్ధోపాయస్వీకారమునందు ముందు విడువవలసిన కర్మజ్ఞానాది రూపములైన ఉపాయాంతరములను విడిచియే స్వీకరింపవలయును అను నియమము చెప్పబడుచున్నది-

౨౦- అతిబలుడయిన రావణుడు రామబాణములచేతను ధనుస్సు ఖండింపబడి శిథిలమైన శరీరముకలవాడై మనస్సు కాలుష్యమును జెంది యుద్ధముచేయచాలక పారిపోవలెనని ప్రయత్నపడుచున్నప్పుడు స్వామివారి యొక్క బాణములను ప్రయోగించుచుండిరి ధర్మయుద్ధముచేయు స్వామి మనలను పోనియ్యక పోవడమునకు హేతువేమని ఊహించి తనచేతులోనున్న ధనుర్దండమే కారణమని నిశ్చయించి భయపడి దానిని విడిచి పెట్టెను- అట్లున్న రావణునికి యుద్ధమునకు సాధనము కాకపోయిన సరేకదా పారిపోవుటకు కూడా ప్రతిబంధకమయినట్లు ఈ ఉపాయములున్ను సాధనములు కాకపోవుటయే గాక ఫలమునకు ప్రతిబంధకము లు

కంటితో చూడతగినట్లుగా చేయుటచేతను సౌలభ్యమున్ను స్ఫుటముగా ప్రకాశించుచున్నవి-

౩౬. సుగ్రములను తోలుటకు హస్తమందు ధరించిన వేత్రమును అనగా కొరడాయును ఎటువైపు తిరుగవలసిన అటువైపు త్రిప్పుటకును నిలుపవలసినస్థలమందు నిలుపుటకును పట్టుకొన్నలగాములును, తలయందు కిరీటము మొదలైన ఆచ్ఛాదనము లేకపోవుటచేతను సేనాధూళిచేత కప్పబడ్డ శిరోజములును రథమునకు క్రిందుగా వ్రేలవేసిన శ్రీపాదములును కలవాడైనిలిచియున్న సారథ్యవేషమును, మామ్. అని కనపరుచుచున్నాడు-

౩౭. ఏకమ్, అనుపదమునకు అర్థము చెప్పబడును-

౩౮. ఈ ఏకశబ్దము స్థానప్రమాణముచేతను ఏవకారార్థమును చెప్పును, స్థానప్రమాణమనగా ఏకశబ్దస్థానమందు ఏవకారము ప్రయోగింపబడియుండుట అనగా ప్రపత్తిని చెప్పుస్థలములయందు ఏవకారముండుటచేతను, ఆ ఏవకారస్థానమందు ఇచ్చట ఏకశబ్దముండుటచేతను, ఈ ఏకశబ్దమునకును ఏవకారార్థమే చెప్పబడును-

౩౯. మామేవయే ప్రపద్యన్తే, నన్నే ఎవరు ప్రపత్తి చేయుచున్నారో తమేవచాద్యం పురుషం ప్రపద్యే, కారణుడైన ఆపురుషునే ప్రపత్తి జేయుచున్నాను- త్వమేవోపాయభూతో మే భవ, నీవే నాకు ఉపాయభూతుడవు కమ్ము, అఱెనక్కు నిన్ పాదమే శరణాగత్తన్దొఴిన్దాయ్ నీ ప్రాప్తికి ఉపాయమును ఉపదేశించుసమయమందు నీ పాదములనే ఉపాయముగా ఉపదేశించినావు, ఇత్యాదులయందువలెనే, మామేకం అనే ఈ స్థలమందును నన్నే అని ఏవకారార్థమునే చెప్పవలయును-

౪౦. ఏవకారార్థమును చెప్పు ఈ ఏకశబ్దముచేతను వ్రజ అనే పదమందు చెప్పబడుచున్న అధ్యవసాయరూపమయిన సిద్ధోపాయస్వీకారమందలి ఉపాయత్వము తీసివేయబడుచున్నది- అనగా నీవే నాకు ఉపాయమువలెనని భగవత్సన్నిధియందు చే

తనుతు చేయు ఉపాయస్వీకారము వాడిచ్చు ఫలమునకు ఉపాయము కాదు. ఆ ఈశ్వరుడే ఉపాయము అని చేయు స్వీకారమందలి ఉపాయత్వమును తీసివేయుచున్నది.

౪౧. ఈ సిద్ధోపాయానన్తరమందే ఫలము సిద్ధించుట చేతనును స్వీకారము లేనప్పుడు ఫలము సిద్ధింపక పోవుట చేతనును ఈ స్వీకారము ఫలసిద్ధికి అవశ్యముండవలసి యుండగా ఇట్టి స్వీకారమందు ఉపాయత్వము ఎటులు తీసివేయబడును. అంటే ఈ స్వీకారానంతరముండు చేతనునికి కలుగబోవు ఫలసిద్ధి ఉపాయభూతుడైన ఈశ్వరుని చేత సిద్ధించినట్లుగానే ఈ స్వీకారమున్ను వానిచేతనే సిద్ధించును. ఇందువల్ల ఈ స్వీకారము ఉపాయభూతుడైన ఈశ్వరునివల్ల పుట్టినదిగాని సాక్షాత్ ఉపాయము కాదు.

౪౨. ఈ సిద్ధోపాయభూతుడయిన ఈశ్వరునివల్ల ఈ ఉపాయ స్వీకారము పుట్టుటయనగా ఈ చేతనులు కరణకళేబరములు లేక అచిద్వస్తువులనే భోగమోక్షములను చెడి, అచిత్ప్రాయులై పడియున్నదశయందు, కరణకళేబరములనిచ్చి, జ్ఞానవికాసమును కలుగజేసి, తానును అనేక అవతారముల నవతరించి, శాస్త్రములను, విశ్వాసములను పుట్టింపతగిన తన కల్యాణగుణ చేష్టితములను ప్రకాశింపజేసి ఈవిధముగా వాడు చేసిన కృషిచే ఫలించినదనుట.

౪౩. జ్ఞానాధికులయిన నిత్యసూరులకు నిర్వాహకుడైన సర్వేశ్వరుని కటాక్షము ప్రసరించిన దానివల్ల వానిని పొందుటకై వానిని జ్ఞానముండుంచుకొన్నాను. అనగా వానినే ఫలసాధనముగా చేసికొనినాను. అని నమ్మాళ్వారులు భగవల్లాభమునకై సిద్ధోపాయము స్వీకరించినానని సాయించుచు ఆ సిద్ధోపాయ స్వీకారమును వానినిర్హేతుక కృపచేతనే నాకు కలిగినది అని సాయించినందువల్ల ఈ స్వీకారము ఈశ్వరుని యొక్క కృషిఫలమనియే గ్రహింపవలయును.

౪౪. చేతనుని సిద్ధోపాయ స్వీకారమందు రుచి పుట్టుటకు కృషిచేయువాడున్ను ఈశ్వరుడే అందువల్ల ఈ చేతనులు సిద్ధో

పాయ స్వీకారముచేసిన మాత్రముచేత ఫలమిచ్చుననియును, అది లేకపోయినప్పుడు ఇయ్యకయుండుననియుఁ దలంపక అశక్తోజ్జీవనమునకే స ర్వదాయత్నించు సర్వేశ్వరుడు మనయొక్క ఇష్టప్రాప్తి, అని ష్టనివారణ, రూపమయిన ఫలమును కలుగుచేయువాడని ప్రతిప త్తి కలిగియుండవలయును.

౪౫. ఈసిద్ధోపాయ స్వీకారముచేయకపోయినను చేతనుల యొక్క కార్యమును ఈశ్వరుడు చేయునని తలపక ఈసిద్ధోపా యస్వీకారమున్ను అవశ్యము కార్యసిద్ధికి ఉండవలెనని తలచినయె డల ఉపాయభూతుడయిన ఈశ్వరునియొక్క సహాయాన్తర వైరపేక్ష్యమునకు భంగము వచ్చును.

౪౬. ఈశ్వరుడు సర్వసముడగుటవలన చేతనకృత్యమును లే శమును అపేక్షింపకయే ముక్తినిచ్చునప్పుడు, అందరికినొక్కసారి యే ముక్తి ఇయ్యక కొందరికే ఇయ్యడమునకు హేతువు ఏమను ప్రశ్న మునకు పరిహారార్థమును, ఇంతకాలము మనలను రక్షింపని ఈ శ్వరుడు నేడు రక్షించునా అను సంశయము కలుగునప్పుడు తన్నివృ త్తి కొరకును, ఈసిద్ధోపాయస్వీకారము వ్యాజమైయుండును.

ఆత్మ అచేతనముగాక చైతన్యము కలవాడై యుండుటచేతనును భగవదేకోపాయత్వరూపమైన ఈ అధ్యవసాయము చైతన్యకార్య మయ్యేయుండును, ఉపాయము కాదు. ఈసిద్ధోపాయము, విధింప బడివచ్చినది కాదు చేతనునియొక్క రుచిబట్టి వచ్చినది.

భగవదేకశేషత్వరూపమైన స్వరూపమునకు విరుద్ధముకా దు. అనుగుణమే, అనాదికాలమునుండి స్వయత్నముచేతను ఈ శ్వరుడుచేయు రక్షణమును అంగీకరింపని చేతనుడు అంగీకరించినందు కు సూచకమును అయియుండును.

౪౭. మామ్, అనుపదమునకు పూర్వమందున్న సర్వధర్మాన్ పరిత్యజ్య అనుస్థలమందు సర్వధర్మపరిత్యాగమును చెప్పిన సర్వేశ్వ రుడు తననుతను ఉపాయాంతరములనును ఉపాయముగా తలపక ఒక్కతె ననే ఉపాయముగా తలపుమని చెప్పెను. ఏకమ్, అనుస్థలమం

ము స్వీకారమందు ఉపాయభావమును తీసివేసి తనను ఉపాయస్వీకారము చేయువానిని ఉపాయముగా తలపక, ఒక్కరతనే ఉపాయముగా తలంపుమని చెప్పుచున్నాడు.

౪౮. నిరుపాధిక రక్షకుడైన ఈశ్వరుని రక్ష్యభూతుడైన చేతనుడు తనరక్షణమున కుపయుక్తముగా ఆశ్రయించిన ఆశ్రయణము అనగా స్వీకరించు స్వీకారము అహంకారగర్భము, కొమారుడు తనను పోషించుటకై తండ్రిచేత వ్రాయించుకొన్నట్లుగా వ్యవహారమును అనగా నింద్యమున్ను.

౪౯. చేతనులను రక్షించుటకు సమర్థుడైన ఈశ్వరుడు రక్షించుటకు అభిమానించి పరిగ్రహించుటయను స్వీకారమే చేతనులకు రక్షకము.

౫౦. సిద్ధోపాయముకన్న ఇతరములైన ఉపాయాంతరముల యొక్క స్వరూపము చేతనప్రవృత్తిరూపమైన వ్యాపారముచేతనే సిద్ధింపవలసియుండుటచేతను వాటికి చేతనునియొక్క స్వయత్ననివృత్తి దోషమై యుండును. సిద్ధోపాయము సహాయాంతరమును సహింపక పోవుటచేతను దీనికి చేతనునియొక్క ప్రవృత్తిరూపమైన వ్యాపారము దోషమై యుండును.

౫౧. నమ్మాళ్వారలు సిద్ధోపాయస్వీకారమును ఉపదేశించు సమయమందు విశేషించి వ్యాపింపనక్కరలేదు. ఉండుటయే చాలును అని ఉపదేశించినందువల్ల సిద్ధోపాయస్వీకారము చేయువారలకు ఏవ్యాపారమును చేయనక్కరలేదు.

౫౨. క్రింద, అనగా సర్వధర్మాన్ పరిత్యజ్య అను శ్లోకమందు చేతనులయొక్క సకలప్రవృత్తినివృత్తియును చెప్పబడెను.

౫౩. నాయొక్క దుష్టమనస్సును పోగొట్టి వారు నిన్ను అనుభవించి సేవించుటకు మనస్సును ఇచ్చినావు. అని ఉపాయభూతుడైన ఈశ్వరుని విషయమై చేతనునికి కలుగు ఉపకారస్మృతియును, చైతన్యమును పట్టివచ్చినదిగనుక ఉపాయములో చేరదు.

౫౪. శరణమ్ అనుపదమునకు.

౫౫- ఉపాయముగా అని అర్థము-

౫౬- ఈశరణశబ్దము లక్షించువానిని, స్వీకారము ఉపాయముగా కనపరచినను ఈస్థలమందు అనగా ఉపాయాంతరములను విడచి ఈశ్వరునే ఉపాయముగా వరించు స్థలమందు, ఉపాయమునే కనపర్చును- ఏలనుచేతనంటె సర్వోపాయములను విడచి ననే పట్టుమని చెప్పుచున్న స్థలమగుటచేతను ఉపాయమును చెప్పిననే సర్వధర్మాన్ పరిత్యజ్య అనుక్రింది వాక్యముతో చేరును ఆలాగు చేరని పక్షమునకు ప్రకరణభంగము దోషము వచ్చును ప్రకరణభంగమనగా ఒక అంశమును ఉపపాదించుచు దానికి విరుద్ధమైన అంశమును గాని దానితో సంబంధింపని అంశమును గాని చెప్పుట.

ఈశ్లోకమందు చెప్పబడిన సర్వధర్మపరిత్యాగము ఈశ్వరుని యొక్క ఉపాయత్వమును కనపరుచుచుండగా, శరణశబ్దప్రయోగమునకు అవసరము లేదని కొందరందురు- ఉపాయాంతరత్యాగము చెప్పబడినను అది సిద్ధోపాయ స్వీకారసమయమందువలెనే ప్రాప్యసమయమందును సమానమైయున్నది- ఎందుచేతననగా ప్రాప్యసిద్ధ్యనంతరమందు ఏరు దాటిన వెనుక నావతో ప్రయోజనము లేనట్లు ఉపాయాంతరములతో ప్రయోజనము లేదు కాబట్టి. ఈ ఉపాయాంతరత్యాగముతో కూడియున్నను వ్రజ అనుపదములో చెప్పిన స్వీకారమాత్రము ప్రాప్యసమయమందలి స్వీకారమును తీసివేసి సిద్ధోపాయస్వీకారమును స్థాపింపజాలదు.

సిద్ధోపాయస్వీకారమున కంగముగా విధింపబడిన ఈ ఉపాయాంతరత్యాగము అంగియైన సిద్ధోపాయస్వీకారమును అర్థముగా కనపరచినను దానికన్న శబ్దముగా చెప్పబడవలెనగుట చేతను అవశ్యము శరణశబ్దప్రయోగముండవలయును-

౫౭. వ్రజ, అనుపదమునకు-

౫౮- బుద్ధిచేయుము అని అర్థము-

౫౯. వ్రజగత్యర్థా? అనుధాతువు గతిని చెప్పును, యేగత్యర్థాః, తే

ప్రాప్తి, అనిష్టనివారణములను చేయునపుడు తత్పూర్వ, ఉత్తరస్థితులను తెలిసికొనుటకును అటుపిమ్మట వానికార్యమును చేయుటకును అవశ్యకమయిన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వములనును చేతనునికి చేయు కార్యములను స్వకార్యముగా దలచి నెరవేర్చుట కుపయుక్తమైన శేషిత్వరూపసంబంధమునును, అవాప్తసమస్తకామత్వమును పూర్తిగ నిన్ని ప్రకాశింపజేయుచున్నది-

౬౬- మామ్ అనుపదమునందు నీకు సారథిని అయినిలిచియున్న నన్ను, ఉపాయముగా ఆశ్రయింపుమని స్వామి చెప్పినప్పుడు, అర్జునుడు తనరక్షకార్థమై స్వామిధరించిన సారథ్యవేషమును చూచి, సర్వస్వామి అయినవాడు ఇట్టినీచకృత్యమందునిలిచినది- ఆయనసౌశీల్యము చేతనని తలపక మనకునీచకృత్యమును చేయువాడు మనలనురక్షింపగలుగునా అని తననుపట్టి చూచి భయపడగా అట్టి భయము, తీరునట్లు నిరంకుశస్వాతంత్ర్యరూపమైన పరత్వమును అహమ్ అనుపదముచేతను ప్రకాశింపజేయుచున్నాడు-

౬౭- ఇట్టి పరమస్వతంత్రుడగు ఈశ్వరుడు అర్జునునికి సారథియైనిలిచిన ఈ పారతంత్ర్యమున్ను తనయొక్క నిరంకుశ స్వాతంత్ర్యకార్యమే-

౬౮- త్వా అనుపదమునకు-

౬౯- నీకార్యమును తెలిసికొనుటకు తగినజ్ఞానములేనివాడవై తెలిసినను నెరవేర్చుకొనుటకు తగినశక్తిలేనివాడవై, శక్తికలిగి యుండినను నీయొక్క రక్షణమందు నీకు ప్రాప్తిలేనివాడవై, అనగా సంబంధములేనివాడవై, యుండుటచేతను స్వతంత్రోపాయములయిన సర్వధర్మలను విడిచి నన్నేనిరపేక్షసాధనముగా పట్టియున్న నిన్ను అని అర్థము-

౭౦- సర్వపాపేభ్యః అనుపదమునకు-

౭౧- నాప్రాప్తికి ప్రతిబంధకములని అనగా, మోక్షప్రతిబంధకములని యేయేపాతకములనుచూచి భయపడుచున్నావో ఆయాపాపములన్నిటివలననుండి అని అర్థము-

ఈస్థలమందు భగవత్ప్రాప్తి విరోధులను మాత్రము చెప్పుటచే జ్ఞానవిరోధులును రుచివిరోధులును ఉపాయవిరోధులును పూర్వాధ్యాయములయందే తెలిపివేయబడినట్లు స్పష్టమగుచున్నది.

పాపశబ్దము యొక్క బహువచనార్థము చెప్పబడుచున్నది.

౭౨. దేహాత్మాభిమానమనెడు, అసత్యజ్ఞానమున్ను సాంసారికవృత్తిరూపమయిన దుష్టవ్యాపారమున్ను, రక్తమాంసాదిమయమైన మలినదేహమున్ను అని ఆళ్వార్లు తిరువిరుత్తమను ప్రబంధము యొక్క మొదటిపాశురమందు పాడిన ప్రకారముగా అవిద్యయు, కర్మము, వాసనయు, రుచియు, ప్రకృతిసంబంధమును చెప్పబడుచున్నవి.

౧. అవిద్యయనునది, అజ్ఞాన, అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞానములని మూడువిధములుగానుండును, అజ్ఞానమనగా, జ్ఞానము లేకపోవుట, అనగా, దేహముకంటె వేరే ఆత్మయున్నాడను జ్ఞానము లేకపోవుట. అన్యథాజ్ఞానమనగా ధర్మియందు ధర్మాంతరప్రతిపత్తి, ఉదాహరణము. పీతశ్శంఖః. శంఖము పచ్చనిది అని శంఖమునకు స్వాభావికమైన తెలుపుగుణమును గ్రహింపక పచ్చనిదిగా గ్రహించుట. విపరీతజ్ఞానమనగా ధర్మియందు ధర్మ్యంతరప్రతిపత్తి, ఉ॥ ఇదం రజతమ్ అని శుక్తికను రజతముగా గ్రహించుటయు, రజతమును, గంగము అనగా తగరముగా గ్రహించుటయు.

౨. కర్మమనునది పుణ్యము పాపము అని రెండువిధములై యుండును, పుణ్యమున్ను పాపమువలెనే మోక్షప్రతిబంధకమగుటచేత పాపశబ్దములో అంతర్భూతమగును కాబట్టి సర్వాపేక్షతో ఈస్థలమందు పుణ్యములున్ను పాపశబ్దముచేత చెప్పబడుచున్నవి.

౩. వాసన అనగా అబుద్ధిపూర్వకమయిన వ్యాపారమునకు హేతువు అయియుండునది ఇదియును అజ్ఞానవాసన, కర్మవాసన, ప్రకృతిసంబంధవాసన అనివివిధములుగానుండును.

౪. రుచియనగా, బుద్ధిపూర్వకవ్యాపారమునకు హేతువు, అది

జ్ఞానాది ఉపాయాంతరములను స్వరూపతః విడవలేము. విడువందగినది ఉపాయత్వమునే విడచినాడు.

౯౪. స్వవర్ణ, ఆశ్రమముల కుచితముగా చేయదగు చేయు విహితకర్మలందు ఉపాయబుద్ధి చేయక లోకమునందు కృపచేత పరులకొరకే చేయుటచేతను ఆకర్మము ఈశ్వరునికి ముఖోల్లాసహేతువై యుండును. అందువలననే ఈశ్వరప్రీతికొరకై చేయు కైంకర్యములో చేరును.

ఆత్మస్వరూపజ్ఞాన పూర్వకముగా పరమాత్మస్వరూపమును సాక్షాత్కరించుటకు ఉపయుక్తమైన జ్ఞానమందు ఉపాయబుద్ధి పోవుటతోనే ఇది స్వరూపజ్ఞానములో చేరును

భగవత్ప్రాప్తికి సాధనమైన భక్తియందు ఉపాయత్వము పోవుటతోనే భోజనమునకు పూర్వమందుండు ఆకలి వలెనే ఇది ప్రాప్యమైన కైంకర్యమునకు పూర్వక్షణమందుండు రుచిలో చేరును, సిద్ధోపాయవరణరూపమైన ప్రపత్తియందు ఉపాయత్వము పోవుటతోనే ఇది భగవదత్యంతపరతంత్రమైన ఆత్మస్వరూపము యొక్క యాథాత్మ్యజ్ఞానములో చేరును.

౯౫. భగవత్ప్రాప్తియనెడు ఒక్కఫలమునకు అనేక శాస్త్రములయందు సిద్ధించు కఠినమైన భక్త్యుపాయమున్నను ఈ జన్మమునందే ఒక్కపర్యాయమే చేయదగినదై సులభమైన ప్రపత్త్యుపాయమును ఉపదేశించుటచేతను సాధనములయందుండు తారతమ్యమును చూడక వాటినిమిత్తముగా చేసి ఫలమునిచ్చు సర్వేశ్వరుని యొక్క అనుగ్రహమే ప్రధానముకాబట్టి భక్తిప్రపత్తులు ఉపాయములుకావు ఈశ్వరానుగ్రహమే ఉపాయము.

౯౬. ఫలసిద్ధికి చేతనుడు చేయవలసినది ఈశ్వరుడు చేయు రక్షణమును స్వయత్నముచేత నిషేధింపకపోవుటయును వాడు ఇచ్చుఫలము పురుషార్థమగునట్లు అర్థించుటయును ఇంతమాత్రము చాలును.

౯౭. ధర్మస్వరూపులయిన చక్రవర్తి తిరుమకుమారుని, పాపి

౧౦౭- చరమశ్లోకార్థప్రతిపాదకములగు వార్త్తైయఱి పవర్ అనునమ్మాళ్వారు పాడియుంచిన పాశురమునున్ను, అత్తనాగి యను తిరుమழிశైయాళ్వారు పాడియుంచిన పాశురమునున్ను ఇచ్చట అనుసంధించుకోవలయును-

వార్త్తైయఱిభవర్ మాయవఱ్కాళన్ఱియావరో పోర్త్తపిఱప్పొడునోయొడు మూప్పొడిఱప్పవై। పేర్త్తుప్పెరుమ్తున్బమ్వేరఱనీక్కిత్తన్ తాళిన్ కీழ் శేర్త్తు అవన్ శెయ్యుం శేమత్తై యెణ్ణిత్తెళివుత్తే-

ఈ పాశురమునకు మామేకం శరణం వ్రజఅను వార్త్తను తెలిసికొనినవారు ఆత్మను ఆచ్ఛాదించుకొనియున్న,జన్మములు, వ్యాధులు, ముసలితనము, మరణము మొదలగు వీటిని పోగొట్టి, దేహావసానమందు వచ్చు కైవల్యమనే మహాదుఃఖమును సవాసనగా పోగొట్టి తనతిరువడిగళ్ళక్రిందను చేర్చుకొని పునరావృత్తిరహితముగా సర్వేశ్వరుడు చేయురక్షణమును అనుసంధించి విశ్వాసముగలవారై తమదుఃఖనివర్తకుడై ఆశ్చర్యభూతుడైన వానికి వినాగా అన్యులకు దాసులగుదురా" అనిఅర్థము-

అత్తనాగి యన్నైయాగి, యాళుమెంబిరానుమాయ్, ఒత్తొవ్వాద పల్పిఱప్పొழிత్తు నమ్మైయాళ్ కొళ్వాన్ ముత్తనార్, ముకుందనార్, పుగుందునమ్ముళ్ మేవినార్, ఎత్తినాలిడక్కడల్ కిడత్తి ఏழை నెఞ్జమే ఈపాసురమునకు హేయప్రతిభటుడైనట్టియు మోక్షస్థానమును ఇచ్చునట్టియు సర్వస్వామి, జ్ఞానాకారము చేతను సమానములై దేవమనుష్యాద్యాకారము చేతను భిన్నములైన ఆత్మలయొక్క నానావిధములయిన జన్మములను పోగొట్టి, నిత్యసంసారులమైన మనలను దాసులనుగా పరిగ్రహించుటకై తండ్రి, తల్లి, స్వామి, మొదలగుసర్వవిధబంధువు లయి తమపరత్వమునున్ను మననీపతియున్ను, చూడశమనలో ప్రవేశించి పోకలేకుండా కలసియున్నారు- చపలమనస్సా ఏందుచేత దుఃఖసముద్రమందు పడియుంటున్నావు "అని అర్థము-

## తిరుమన్త్రార్థము-

ఈ చరమశ్లోకమందు సర్వధర్మాన్ అను పదముచేతను సిద్ధోపాయస్వీకారమునకు అంగములగు త్యాజ్య ధర్మములును, పరిత్యజ్య అను పదముచేతను ఆధర్మముల యొక్క త్యాగప్రకారమును, మామ్ అను పదముచేతను త్యాగపూర్వకముగా ఆశ్రయింపబడు సౌలభ్యాదిగుణవిశిష్టవస్తువును, ఏకశబ్దముచేత ఆగుణవిశిష్ట వస్తువు యొక్క సహాయాంతర వైరపేక్ష్యమును, శరణశబ్దముచేతను ఆవస్తువు యొక్క ఉపాయత్వమును, వ్రజ అనుపదముచేత ఉపాయస్వీకారమును, అహమ్ అనుపదముచేత క్రిందస్వీకరింపబడిన ఉపాయవస్తువు యొక్క జ్ఞానశక్త్యాదిగుణయోగమును, త్వా అనుపదముచేత అవస్తువునందున్యస్తభరుడైన అధికారి యొక్క స్వరూపమును, సర్వపాపేభ్యః అనుపదముచేత ఆఅధికారికి విరోధియగు పాపసమూహమును మోక్షయిష్యామి అనుపదముచేతను, ఆపాపవిమోచనప్రకారమును, మాశుచః అనుపదముచేత పాపవిమోచకుడగు ఈశ్వరుని ఆశ్రయించిన అధికారి యొక్క నిర్భరత్వమును, చెప్పబడెను-

జీయర్ తిరువడిగళే శరణమ్-

---

తిరుమన్త్రార్థము సంపూర్ణము.



